ఉత్తమ సాధ్వి, ఉదాత్త చరిత

త్యాగమయి

దేశభక్తాగ్రణి

ఆంధ్రప్రదేశ్ ప్రథమ మహిళా గవర్నరు

**శ్రీమతి శారదా ముఖర్జీగారికి**

గౌరవ ప్రేమాదరములతో

# కనకాభిషేక సమయ కానుక

ఈ మహిళా విక్రమసూక్త కావ్యము అనంతపురం లలిత కళాపరిషత్తువారు 20-11-77 వ తేదీనాడు ఆంధ్రప్రదేశ్ మహిళాగవర్నరుగారు శ్రీమతి శారదాముఖర్జీగారి ఆధ్వర్యమున నాకు కనకాభిషేకమొనర్చినపుడు ఆంధ్ర సరస్వతీమతల్లి పద పంకజ మరందబిందువుగా వెలువరింపబడి, ఉత్తమసాధ్వి శ్రీమతి శారదాముఖర్జీగారి కంకితముగావింపబడినది.

చేటుకూరి లక్ష్మీకాంతమ్మ

# త్రిమూర్తి లలితా స్తవమ్

## శారదా స్తుతి

బ్రహ్మాణీం, సుకలాం, సదా పరబ్రహ్మస్వరూపిణీమ్
సురజ్యేష్ఠ ప్రియామ్, భక్త సులభామ్, సురవందితాం॥

వీణామంజులపాణిపల్లవయుగళభ్రాజితామ్
విద్యాధిష్ఠానదేవతామ్ విజ్ఞానాత్మప్రశోభితామ్॥

నాదబ్రహ్మమయీమ్, నవామ్, ప్రణవనాదోద్భాసితామ్
నానార్ధధ్వనిశ్రవణయినీం సౌవర్ణ వర్ణాత్మికామ్॥

చంద్రామలశుభ్రమూర్తి లలితామ్, నాగధీశ్వరీమ్
గైర్వాణీమ్, సురభారతీమ్ రమ్యార్థసూక్తిసుందరీమ్॥

వందేజగద్వందితామ్ శారదామ్ గిరాం దేవతామ్॥

లక్ష్మీ స్తుతి

భువనేశ్వరీమ్, ప్రభూతామ్ త్రిభువనమయీమ్ శ్రియమ్
జగత్సాక్షిప్రలోచనామ్ జగన్మాతరమిందిరామ్
ఐంద్రీం, సర్వైశ్వర్యప్రదామ్ ప్రణతార్థ సంవర్ధనీమ్
సంపల్లాభప్రయచ్ఛనా శౌర్యప్రచండోల్లాసినీమ్
లక్ష్మీమ్, క్షీరాబ్ధితనయాం వందేముకుందప్రియామ్

గౌరీస్తుతి

అఖిలాండేశ్వరీమ్ శివామ్ పరమాహ్లాదినీమ్ పరామ్
చిద్రూపీమ్, పరదేవతామ్ చిత్కుండాగ్నిసుసంభవామ్
గౌరీమ్, మహిళామాంగల్య సౌభాగ్య ప్రవిధాయినీమ్
త్రిభువనప్రియకరీమ్ త్రిమూర్తిలలితాం సతీమ్
ఆర్యామంతర్విభావయేహం, దుర్గామ్, పరామ్ దేవతామ్॥

ఓం తత్సత్

# మహిళావిక్రమ సూక్తము

రుద్రమ్మ దిద్దిన రుధిరాక్షరపుఁ బంక్తి
కాలవాహినిలోనఁ గలిగిపోయె

చాంద్ బీ త్రిప్పిన చండఖడ్గపు ధార
త్రుప్పువట్టుచుతునా తునకలయ్యె

రాణిఅహల్యాదే రమ్యశాసనమ్మును
ధారుణిన్ దలఁచెడు వారులేరు

గంగమ్మమలఁచిన ఘనయుద్ధపాండితి
మధురవీధులలోనె విధురమయ్యె

జిజియా గడిపిన చేవలుదీర్చెడు
వీరంపుటుగుబాలు విరిగిపోయె

మాంచాల యిడినట్టి మగువఖడ్గమునేడు
మొక్కవోయియుఁ బెనుముక్కలయ్యె

తల్లి వాసవియొక్క త్యాగవైభవమిల
పొల్లువోవుచుమలి పుల్లవడియె

చానమ్మ నెఱపిన సాహసవృత్తము
మట్టిలోఁ బొర్లాడి మాగువడియె
కస్తూరి యిడిన రక్తతిలకమందున
పూతివాసనయెంతోపులుము కొనియె
కవిసరోజిని దైన్యనఘనదేశభక్తిదా
రమ్యగుణస్ఫూర్తిరాలిపోయె

ఇందఱింతుల శౌర్యరసేష్టినేఁడు
భరతమహిళల నావేశపఱచెనేని
మాతృభారతి దుఃఖమ్ము మాయు నిజము;
ప్రజలదైన్యమ్ము వాయుట నిజముసుమ్ము

# మహిళావిక్రమ సూక్తము

## వైదిక ఖండము

మహిళాసర్గమె మహికి సమస్తము
[1] మహిని గ్రహించెడి మహత్వార్థమది
మహిళయ కాదే-మహిళయ కాదే॥

[2] ప్రకృతి యెమూలము పరమౌసృష్టికి
పురుషుఁడు పుష్కరపలాశముంబలె
అతినిర్లేపుఁడు - అతినిర్లేపుఁడు॥

సత్తర జస్తమములు - త్రిగుణమ్ములు
ప్రకృతిని సమముగ మేళనమందిన
స్త్రీయుదయించును త్రిగుణాత్మకయై
స్త్రీవర్తించును త్రిగుణాతీతగ

---

1 మహీం లాతీతి-మహిలా = మహిని గ్రహించునది మహిళ

2 ప్రకృతిః కర్త్రీ - పురుషస్తు పుష్కరపలాశ వన్నిర్లేపః సాంఖ్యోక్తి

రమణులు పూజ్యతగనిన స్థలమ్మున
రమియింతురుసుమీ దేవతలెప్పుడు
రామలభాగ్యమె రసనీభాగ్యము
రామాలయున్నతి రసకును ఉన్నతి

'జాయేదస్తమ్మ'టంచు చానకు
సర్వస్వతంత్రతమిచ్చిరి ఋషులును
ఆకసరాజ్యము నాక్రమించి కడు
ఉల్లసమందెడు ఉసకన్యకును

పైతృక భాగమునొందెడు పుత్రిగ
అభివర్ణించెను వైదిక ఋషితతి॥

వృత్తివిద్యచే నార్జనచేసెడు
పడతుకలుండెడి భాగ్యకాలమది
వేదగాధలివి విదితముసేయును

## పురాణ ఖండము

[1] విదుషీమణులౌ చదురాండ్రేయుగ
మునసైనపురుషులె సుమియటంచును
పురాణ వాఙ్మయమూది పల్కెగద

[2] "మహిళలు మహాజ్ఞానవతు" లంచును
"మాండూక్య" మ్మది మఱిమఱివాకొనె

---

1. "స్త్రీషు సతీషు పుంసుంస ఉ గే"

2. "మహిళా అపిచ మహాజ్ఞానినః"

సాయంసంధ్యను ఋషులకు వందన
మాచరించునెడ మహిళాఋషులకు
వందనమిడుటాచారము మనకును

మానవసంతతి గురుపరంపరను
మాతృదేవికే ప్రథమస్థానము
మాతృదేవోభవయన్ మాన్యాంపు
సూక్తికినియ్యదియేకద యర్థము

భవతిభిక్షాందేహి యను సుతునకు
భిక్షమిడి విద్యార్జన కంపెడు
ప్రప్రథమాచార్యత జననిదె కాదె

జీవితసరళిని పత్నీ పతులకు
ధర్మార్థ కామ సాధన యందున
అతిచరించుటేమాత్రము తగదని
పెండ్లికుమార్తెయు, పెండ్లికుమారుడు
సమగతి పెండిలివేళ ప్రమాణము
సల్పుట మనవైవాహిక సంస్కృతి

సతికిని. పతికిని. శీలము ముఖ్యము
శీలము తప్పిన స్త్రీపురుషులకును
దండన విధియొకరీతినె జరుగగ
మానవకులపతి మనువు విధించెను

అతిచరియించిన పతిదండనకై
అతివలున్యాయస్థలికేగుట మను
ధర్మవిహితమిది యెందఱెఱుంగుదు
రని ప్రశ్నించిన బడయము త్తరము

పృథివిని, సకలమానవులు, స్వయముగ
దామే. శిక్షించు కొనందగునంచు
మనువు విధియించిన, స్వయం శిక్షా
సూత్రమునందున నరనారులకు
నెంచగ భేదము కానగలేమే

'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' యంచు
తరుణికి స్వాతంత్ర్యమ్మె తగదని
మనువువచించిన సూక్తిని సందియ
మందగ, పనికలదే. భావింపుడు

మగువలు జాతికి మణిపూసలుగద
వారల రక్షణమాయా దశలను

పురుషులు గావింపగవలెనంచదీ
మనువు విధించిన కఠినశాసనము

గృహిసర్వస్వము గృహిణియగుటచే
గృహిగౌరవమది, గృహలక్ష్మిదేకద
గృహస్థాశ్రమపు కీర్తిపతాకలు
భామినులేయను భావముదప్పే ?

దుస్సంతతి కలుగుదుశ్శీలురకు
ప్రగతి నిరోధమ్మా సంతతియె
పురుషులకైనను, పురంధ్రులకైన
దుశ్శీలమ్ముల దుఃఖకారణము
మనుజుని మనుగడకె ప్రమాదమ్మది

సమాజమెప్పుడు ప్రమోదమందగ
సతులు శీలవతులగుటయు దప్పా
దుష్టశీలమున పురుషులతో, సరి
పోటీపడుటయు బోటికితగునే?

పతివ్రతలయ్యెడు పడతులకడుపున
కలిగిన పొడమిన సంతతి వలననె తిరముగ
మహికిని శోకము మాయును; అప్పుడె
వసుధాచక్రము, వర్ధిలుశాంతిని!

ఘర్షణ రహిత సమాజస్థాపన
యావశ్యకమని యెంచెదరేనియు

మానిని గర్వము మాన్యమ్మగునట్లు
మానవసంఘము బాధ్యత గొనదగు
ప్రకృతిరహస్యమిమ్మది గనకేమియొ
ఫలవించుటయు ప్రయోజనరహితము

అట్లని సాధ్వికి నవమతిసల్పుట
అబల, అబల, యంచును, హింసించుట
ఇంతులవ వహేళన సేయుట
రామలు, ఆత్మగౌరవము, వీడుట
మానిని వదమున కేయువయశమగు
ముగుదలు గౌరవమును కోల్పోవుట
కంటెను నీచము మహిలోగానము
ఆత్మగౌరవము కల్గిన అతివయె
పుడమిని పూజ్యతపొందునటంచును
శకుంతలాసతి చరితమె వాకొను

కావ్య ఖండము

వేటకువచ్చిన భూవిభుడాటగ
గాంధర్వవిధి వివాహమ్మాడియు
ప్రజాపవాదభీతి వంచింపగ
ఆకసవాణియు వెలుగిడిచాటదె;
ధర్మము! మామ్మాత్రికిని శకుంతల

దుష్యంతుని నిజసతి యను సత్యము!
[1] మతంగముని యాశ్రమమున కేగిన
నిజసతి కాంక్షలొక్కడె పతి!

సాధ్విశకుంతల తనయుండేకద
సత్త్వదమనుడౌ, భరతకుమారుడు
భరతుని పేరున భారతదేశము
ఖ్యాతిని నొందుటె గర్వకారణము!
నాతికిగల గౌరవమది తెల్పును!

సీతాచరితమె శ్రీరామాయణ
మని, వాల్మీకియె, వ్రాసెపద్యమున
సీతాసాధ్వికిఁగల గౌరవపద
మవనిని, నింకెవరికి లభించును?

తనకును నెనయగు తరుణుడు దొఱకమి:
బ్రహ్మచారిణిగ వర్తిలెసులభయు

భర్తను తపసిగ దిద్దెడుపూనిక
ఆత్మసాధనల నన్నిటినేర్పియు
తపమొనరించుచు పతి, వనినుండగ
రాజ్యంబేలెను చూడాలి సతియు!

---

1. కాళిదాసయభిజ్ఞాన శకుంతల మనుసరించిన పద్ధతిలో

సమరరంగమున నుఱికిన సత్యయు
కేకయాత్మజయు కీర్తివహింపరె?

జన్నము సల్పిన అన్నులమిన్నలు
మంత్రదర్శనమొనర్చిన మగువలు
అపాల, విశ్వవార, వాగ్దేవులు
వెలసిరి, ఈభువి, వెలదుకలెందఱో!

కదనము సల్పిన గజగమనలు మఱి
కొదువకాదను నొక కఠినసత్యము
నూదిపల్కె, మఱి, వేదవాఙ్మయము

ఆత్మవిద్యలో, నాఱితేఱి, తా
యాజ్ఞవల్క్యుశి ప్రశ్నించె, మునుగార్గి

గృహిణిగానె తానాత్మజ్ఞానము
బడసెను, మైత్రేయియు తనపతికడ

అవమతి నొనరుచు తులువల నెదిరిచి
న్యాయము గోరెను నాతియు ద్రౌపది
ధర్మశాస్త్రవేత్తకు ద్రౌపదికిని
జోహార్లిచ్చెను లోకమ్మంతయు

దుండగీడులేసుతులను దిద్దగ
నిందుకొల్పవనె నింతిని భూపతి
కోరెను, వెసగాంధారిని, సమ్మతి

నిజపతికిని, యతి శంకరులకు, నొగి
నడచిన వాదము నందునన్యాయము

దీర్పగ, శంకరు నాహ్వానముపైఁ
దీర్పరియై నిలిచెనుభయభారతి

వైదిక పౌరాణిక గాథలెన్ని
నుడివిన, నుజ్జ్వల మహిళాచరితో
దంతము, వీనులవిందుఁగ, వినఁబడు
చుండును, తనివియు తీరదు మనకును

## చరిత్ర ఖండము

చరిత్రయుగమున సన్నుతి నొందిన
వీరనారులయు ధీర మహిళలయు
విశ్రుత చరితలు, వినఁగా నౌనిక

ధర్మరక్షణకు, రాణీ రుద్రమ
ఝాన్సీలక్ష్మియు, చాందుబీబియును
పోరుసల్పి తామెత్తరె ! భారత
నారీగౌరవ విజయ పతాకము !

కదనరంగ మునికాంతుని అసువుల
నిల్పిన ధీరభామినిని, రాణీ
సంయుక్తను, సన్నుతింపవలదె ?

వైదికకాలము నుండియు చూచిన
వేదసాదలను భేదము లేకను
ధర్మము దప్పని సరణిని, సమగతి
మగువలు వలచిన మగలను

ననువౌ ధర్మము స్వయంవరముకద।
స్వయంవరమ్మే కాంతా స్వతంత్ర
వృత్తిని జాటెడు కేతనమౌగద!

ఆధునిక ఖండము

ఆండాల్, మీరా, భక్తికవిత్వము
భారతి పదనూపుర నిక్వాణము

అవ్వాలల్లియును, అవ్వైయారును
ఆధ్యాత్మిక పర కావ్యము లల్లియు
జగము పవిత్రము చేసిన మగువలు.

మొల్లమాంబ మఱి గంగాదేవియు
మోహనాంగి మఱి ముద్దుపళనియు
వేగమాంబ యల రంగాజీయును
మధురవాణి మొదలగు నలివేణులు
నల్లవితోక్తుల సరస్వతీస్తవ
గానము సల్పిన సత్కవయిత్రులు-

గౌతమిబాలా, జిజియాబాయీ
వీరమాతలకు నివాళులియ్యరె!
ఖన్నా చూపిన ఖగోళపాండితి
పన్నా చూపిన స్వామిభక్తియును
లీలావతి సతి గణిత పాండితియు
వికట నితంబా ప్రశస్త కవితయు

నాచీ కవితా విజయ యాత్రయును
విశ్వ చరిత్ర వీధులన్ వెలసెను
ప్రభువె తన్ను వరించిన నొల్లక
కులపెద్దలతో కూడియు దానుగి
అగ్గిని దూకియు ఆత్మార్పణ మొన
రించిన వాసవి కన్యక కిదెనతి.
మోహమత్తుడౌ పతినుద్బోధించి
కాంతుని కరమున కరవాలమ్మిడి
రణమున కంపిన సుచిర వియోగిని
మగువ మాంచాల మాన్యత నొందదె?

నాయకురాలౌ నాగమ బుద్ధికి
తంత్రజ్ఞతకును భళిభళి యనరే

అద్దిర! పద్మిని పతి సేవారతి!
మాయురె! మల్లమ పాతివ్రత్యము!
ప్రాక్తన భారత మహిళల శక్తినిఁ
గాంచిన మది నాశ్చర్యము వొడమును !
మధ్యయుగమున మానిని పసిచెడి
బలహీనత జడయుటచే పురుషుని
కర్కశ శక్తికి బానిసయయ్యెను
ముష్కరుతో పురుషులు, వెలదులు వలు
బాములనిడి హింసింతురు ప్రమదల

అయినను బుద్ధిపాటవము, జ్ఞానము
శక్తియు, మానవకోటికి సహజము
కాటన. నెందును మగువలు మగలకు
తీసిపోరనెడు దివ్యసత్యమును
ఋజువు పఱచిరిల, ప్రస్తుత మహిళలు
తోరూదత్తు సరోజినినాయుడు
వెలసిరి కవయిత్రీ ధ్రువతారలు
గా, భారత సాహిత్యాంబరమున
రసరాజ్యము నేలిన వరరమణుల
రమ్యచరిత్రలు నేటికి కొల్లలు
తోతాపురియును, శారద మాయీ
ఆత్మజ్ఞత సాధించిన అబలలు
పూజ్య మహాత్మని గనిన తల్లికిని
పూతచరిత్రకు పుత్తలీబాయికి
పురుడెవ్వరు పుడమిని లేరికదా !

సత్యాగ్రహ ఖండము

గాంధీ మహాత్ముని శంఖారావము
వీనుల సోక నెందక న్నెఱుగని
పొలతులు వరదా చించియు, ఇండ్లను
విడచియు, స్వతంత్ర రణమున నుఱికియు

సాహస శక్తిని సమరము సల్పియు
బాపూ ప్రస్తుతి బడయుటెఱుంగమె ?

మాతృశ్రీ కస్తూరిమాత యపూర్వ
త్యాగచరిత్రము, ధీవైభవమును
జగతి జనమ్ములు కొనియాడరే కడు!

దుర్గాబాయీ, లక్ష్మిబాయీ
ధీర చరిత్ర కల వీరవనితలు
బ్రిటిషు సింహపు జూల్పెలకి స్వాతం
త్ర్య చరిత మలచిన భారత రమణులు

పశ్చిమదేశపు పడంతుకలయ్యును
అనిబిసెంటూ, మదాము క్షామా
స్లేడు కన్యయు, సోదరి నివేదిత
భారతాంగనలై బహు శ్రమకోర్చి
భారత సంస్కృతి నేర్చియు మించిరి
భారత మాతకు సేవలు సల్పిరి.

## సంస్కార ఖండము

వీరేశలింగము, కృష్ణరాయుడు
మహిళా సమాజ మహితోన్నతికై
సాగించిరి వితంతు వివాహ సం
స్కారము, స్త్రీ విద్యా సంస్కృతియును

ముదితలు నేరని విద్దెలు లేవని
లక్ష్మీనృసింహ ధీనిధి పల్కెను
బుద్ధివిభవమున, పురుషులు పడతుల
సరికారనుచును సజ్జనులాడిన
సుద్దులు నిజమని ఋజువు చేయుచును

## ప్రస్తుత ఖండము

ప్రస్తుత మహిళలు నవసమాజ ని
ర్మాణము నందున పాల్గొని, తమతమ
బాధ్యత తీర్చుచు భారత రమణుల
పేరు ప్రతిష్ఠలు పెంపుసేయుటా
నందహితు వభ్యుదయ చిహ్నమును,

వైద్యవృత్తిఁగొని, వాదవృత్తిగొని
ఆచార్య పదవిగొని యతివలు, మఱి
సమాజావసరముల కడుచక్కగ
తీర్చుచు నుండిరి స్త్రీలు కడుంగడు

ఎన్నో వృత్తుల, మఱియెన్నెన్నో
ఉద్యోగములబని గొని మహిళలు
దేశమాత సేవించుట శోభా
వహామౌ, మహత్కార్య మౌనుగదా!

కథలను, నవలల, కవితల వ్రాసియు
ఆంధ్ర శారదారాధన సల్పియు
పేను మిగులుట విశిష్టతయే గద!

అయినను స్త్రీ ప్రతిపత్తికిఁ దగినటు
లింకను నుద్యోగము లీయగదగు
స్త్రీ విద్యకు నింకను నధికముగా
విద్యాసంస్థల నేర్పరింపఁదగు

రాజకీయముగ రమణికి సరియగు
స్థానమంతగా లభియింపమి యొక
కొఱఁతగా నిప్పుడెన్నఁగాదగు

ఇందిరగాంధీ విశ్వమహిళగా
ఎన్నఁగబడుటది యెంతయు స్తుత్యము
భారత ప్రధానియై భరతోర్వి
భళిభళియనఁగా బరిపాలించుట
ప్రస్తుతిపాత్రము! ప్రాభవమహితము

అన్నిరంగముల నఖండయశమున్
ఆర్జించిన మన ఆంధ్రరాష్ట్రమును

సాక్షిత్సారద శారదముఖర్జి
గవర్నరై, తాఁకడుసమర్థతను
శాసించుట కడు స్తవనీయమౌ

మంత్రివర్గమున మాన్యతఁగనుటయు
హర్ష దాయకము సమున్నతి పాత్రము
కానీ గృహాలక్ష్ములు పలువురు మం
త్రాంగము నెఱపుట వశ్యము కాదే!

ఎంతనేర్చినా ఎంతచేసినా
కాంత బ్రదుకులో కొంత మేరకు
అప్రశుతి దొరలుట సాంఘిక పరముగ
అపరాధమె యగుట మఱువరానిది
యుగయుగముల గల మగు నలచరితము
బానిసతనమును ప్రతిబింబించుట
భారతదేశపు ఖ్యాతికె కళంక
మందురు సతము విజ్ఞులెందరో
ఈనుడి నింతకు పరాస్తమొనరిచి
మహిళలు ఉన్నతినందుట మాన్యము

ఆర్థికస్వాతంత్ర్యమతివ పొంద
కుండుటది యెంతలోపమొ వాకొన
రానిది కాదే, యెంచగ మహిలో

పైతృకభాగము, పతిలోభాగము
విద్యాశక్తియు, వివిధరంగముల

సమాన నిష్పత్తిని సాధించిన
నాడే, పారసనయనలు స్వతంత్ర
శక్తిని, ధరణికి, కీర్తినిచెత్తురు

భారతమహిళా సంస్థగ వర్ధిలి
భారతమహిళల హక్కులకై యొగి
జతనముసల్పెడు సంస్థ యుండుటయు
రఘురామలక్ష్మి, లక్ష్మి రఘురామ్
భారతలక్ష్మిగ పాలనసేయుచు
మహిళల ఆస్తిహక్కును, మఱి యెన్నో
హక్కులసాధించుచు, విశ్వవిశ్రుత
కీర్తిగ సంస్థను నడపుట, స్తుత్యము!

సినిమారంగము, రచనారంగము
నందున స్త్రీలను, అసభ్యకరముగ
చిత్రించుట మానక యుండినచో
మాతృమూర్తియౌ మహిళకు మాన్యత
నిలుచుటన్నది, అవహాస్యమేయగు

మహిళను మహిళయె ద్వేషించుటయును
సోదరమహిళ యున్నతి నోర్వమి
కూడనిపనియని, యాడువారెపుడు
గ్రహింతురో, యపుడెమహిళాభ్యుదయము
కల్గుట తథ్యము గ్రహింపవలెనిది!

మహిళలు దమలో సమరసభావము
సాధించినపుడె మహిళాసంఘము
ఘనవిజయము సాధింపఁగగలదిల

మహిళాసర్గమె మహికిసమస్తము
మహిళలయున్నతి మహికిని నున్నతి
మహిళావిజయమె మహికిని మాన్యము
మంగళ చరితల మంగళగానమె
మహికిని మంగళ ప్రవిధాయకమౌ

# నవల - నవరసభరిత

1) బంగారు బొమ్మలై శృంగారముంగూర్చు
అంగనలె రంగారు హరిసూను నక్షత్రమ్ములై
ధరన్ మహనీయ చరితనే రచియించి మించిరే

2) భేరికా భాంకృతుల్ సెలగ భామామణియు, శస్త్రమ్ము
చేబూని, రణము సల్పగ బూన, తటతటన్నాడుచున్
ధరణియె క్రక్కదలెనే

3) కరుణావతారలై, కన్నీటి గాధలై, భర్తృపోషితలైన
సాధ్వీమతల్లులౌ, శీతమ్మ తల్లియున్ సతి యశోధరయు,
మునోన్నరిమ్మతో బాధలన్ సహియించి, మించియున్
ధరణి నేర్పించిరే

4) (ఘోర రాక్షసు జంప, దశరథుఁడు తామించు వీర
విక్రమములన్, ఘోరమ్ముగా పోరు సమయమ్ము
నందుననె, రథము చక్రము తొలగ)అద్దిరా ఆయబల,
కేకయాత్మజపూని, తన వ్రేలు నిరుసగా నమరించి,
పెల్పనన్, రణము కాపాడంగ, మింట దేవతలెల్ల,
ఆశ్చర్యమ్ముం బొంది, భళిభళీ భళీయంచు, సమవృష్టి
గుంపిరే-

5) వరమేనకరాణిసుతా, గంగయున్-పార్వతియు ధరణిలో నెన్నియో, చరితలే వెలయగా, హాసోత్కృష్టులన్ మీరి హాయి వెలయింపరే-

6) రౌద్రమ్ము చెలరేగి, కన్గెంపు లద్రంగ, దేశభద్రముగోరి భద్రకాళియ తానగుచు, రుద్రమ్మ యుద్ధమున్, పొన రించి వేవేగ జయభేరి మొఱసెనే ॥

7) మహిష రాక్షసుడాజి, మాయలెన్నియొ పన్ని, మనసు నొవ్వంగ జేయ, తీండ్రించి వేండ్రించి శంభుదేవుని రాణి, మహిషాసుర మర్దని, భద్రకాళీశక్తి, దివ్యశూలము బట్టి, హుంకారంముం జేయ, పదునాల్గు భువనముల్ భయ ముతో వడకెనే ॥

8) అశ్శరభదశ్శరభ, అరిభయంకరముగా ఆర్చుచున్ పేర్చు చున్, క్రూరరాక్షస పంక్తి చెండాడి, మెండాడి, ప్రేవు లం దోడుచున్ రక్తముం ద్రావుచున్, వీన్గుబెంటలుగా రణక్షోణి, శివమెత్తి, శివశివా, శివశివా యంచుదా. పర శివా, పరవశ్శు ద్రాద్రొక్కె, ప్రళయ నృత్యము సల్పె,

9) శాంత గంభీరయౌ, భక్త మీరాబాయి, హృదయ రంజ కముగా, కవిత లల్లియు, భక్తమందారుడౌ, కృష్ణు, పూజలన్ సల్పగా భక్తరాణా యెన్నొ, కష్టముల్ పాల్సేసి, తుది, ఘోరవిషయములందానీయ ఆ సాధ్వి యుం ద్రావి పరభక్తి తీవ్రతన్నానంద మున్నొంది, తా విజయమ్ముం జెందెనే-

## అబల - బహుభావ శబల

అబల, తా, భావశబలతా రుచిప్రబలతా
వశత, సృష్టికే సొంపు గూర్చెనే

మాతగా, జగన్మాతగా, భువన నేతగా
మహిళ మాన్యతన్-మహిని పొందెనే

భార్యగా, విదిత శౌర్యగా, కార్య ధుర్యగా
ఆర్య, జగతికె సపర్యసల్పెనే

చెల్లిగా, సుగుణవల్లిగా, ధరణి తల్లిగా
కల్పవల్లియై ఖ్యాతిఁ బడసెనే

దుహితగా, వరశక్తి మహితగా, ధర్మ విహితగా
మహిళ తానెంతో మహిముచెందెనే

కలికిగా - సిరుల కొలికిగా, అరికి ములికాగా
చెలియ ఈయిలన్ పొలుపు మీరెనే

గాణగా - మధుర వీణగా - జగజ్జాణగా
చాన యెంతయున్ రాణకెక్కెనే

ఈవిగా - ప్రేమజీవిగా - మించుతీవిగా

పూవుఁబోడియే శేవ మిగిలినే సేవసల్పెనే

గృహిణిగా - మనోహారిణిగా - వ్రాతధరిణిగా

భీతహారిణి నేత్రి పేర్వడసెనే

ముగ్ధగా - ప్రణయ లుబ్ధగా - రుచిస్నిగ్ధగా

ముగుద రాజ్యముల్ కొల్లగొట్టెనే

మధ్యగా - సింహమధ్యగా - జగన్మిథ్యగా దేశమున్

మోహమలచెనే

అమలినాంగి యారాధ్య యాయెనే-

ముద్దుగా - ప్రేమ హద్దుగా - కళల హద్దుగా

ముద్దరాలే - వలపు ముద్రించెనే.

ప్రౌఢగా - నవనవోఢగా - వరమమూఢగా

పూఁబోడి పృథివి - రూఢికెక్కెనే

వలపుగా - వలపుతలపుగా - తలపు మెలపుగా

నెలతలలితయై - కలుములీనెనే

గోలగా - మిగులబేలగా, కాంతిమాలగా

బాలకాంతుహృది - హేలసల్పెనే

ఆలిగా - భద్రకాళిగా - రసిక హేళిగా

మగనాలిమహిని - కేళిసల్పెనే

కక్షుగా - ప్రబలదీక్షగా - విమలశిక్షగా - భువనరక్షగా

తోయజాక్షులే - దక్షులైరిలే

ఆద్యగా - ఆత్మవిద్యగా - దురవబోధ్యగా
సింహమధ్య యారాధ్య యాయెనే

పాటగా - సిరులమూటగా - వెలుగుబాటగా
పాటలాధరయు పాటికెక్కెరే

స్ఫూర్తిగా - అతులకీర్తిగా - రమ్యమూర్తిగా
రమణినిచ్చటన్ - కీర్తిచెందెనే

ఛాయగా - ప్రకృతిమాయగా - మంచిజాయగా
పడతియుర్వరనే హాయినిచ్చెనే

కవితగా - ఉపస్స్రవితగా - సుధాసరితగా
గరితచరిత ప్రశస్తిజెందెనే

కలిమిగా - వింతచెలిమిగా - ఎదలయెలమిగా
చెలియఈయిలన్ బలిమిగాంచెనే

వాసిగా - రూపరాశిగా - సుందరరాశిగా
ప్రదోయదాసియే వాసిగాంచెనే

వధువుగా - ప్రణయమధువుగా - బ్రహ్మాత్ప్రధువుగ
ప్రమదజనులపిచ్చి యెత్తించెనే

లయలుగా - కులుకువయలుగా - రిత్తబయలుగా
పద్మనయనలే - నయముగాంచిరే

వ్రీడగా - రసక్రీడగా - వెలుగునీడగా
ప్రోడలీరసన్ - ఈడుమిగిలిరే

పూర్ణగా - అన్నపూర్ణగా - క్రోధఘూర్ణగా
గృహిణీపూర్ణతా భావమొందెనే

అక్షిగా - విశాలాక్షిగా - జగత్సాక్షిగా
పంకజాక్షులే వెలుగుచూపిరే

దీప్తిగా - అస్త్రవ్యాప్తిగా - కారణాప్తిగా
మంత్రిగా - జగజ్జంత్రిగా - రాగతంత్రిగా
ఇంతిఎంతయో మంతుకెక్కెనే

ఊర్మిగా - ప్రియునికూర్మిగా - ప్రమోదోర్మిగా
ఊర్మిళాసతిగ పేర్మికెక్కెనె

ప్రీతిగా - జగద్రీతిగా - విమలనీతిగా
నాతియీయిలన్ - ఖ్యాతిబడసెనే

ధాత్రిగా - అధిష్ఠాత్రిగా - జగన్నేత్రిగా
కుసుమగాత్రియే - సృష్టినేలెనే

కర్త్రిగా - జగద్ధర్త్రిగా - భువనహంత్రిగా
కాంతసకల కర్తృకతపూనెనె

వాణిగా - నలువరాణిగా కమలపాణిగా
నీలవేణియే విలువచెందనే

లక్ష్మిగా - స్వగృహలక్ష్మిగా - రాజ్యలక్ష్మిగా
విశాలాక్షియే దక్షయాయెనే

గౌరిగా - విజితశౌరిగా - నమతవైరిగా
నారినెప్పుడున్ కీరితింతురె

దుర్గగా - మహోసర్గగా - స్వాపవర్గగా
భర్గురాణిగా

వికృతిగా - మూలప్రకృతిగా - జన్మసుకృతిగ
పొలతి సర్గమందాద్యయా యెనే

గళముగా - సుమంగళముగా - అంగనలు మహి
ఉత్సవము పొంగించిరే.

ఇ తి శ మ్